సామర్థ్యం వున్న మీరు - మనిషిగా - తెలివితేటలు, మోసాలు, పోటీ, అద్భుత శాస్త్ర పరిజ్ఞానం వున్న మీరు; ఆకాశంలోను భూమి మీద సముద్రగర్భంలోను చరించగలిగి గూడా - ఎలక్ట్రానిక్ మెదడులను సైతం అన్వేషించగల మీరు అత్యంత ప్రధానం అయిన ఈ వస్తువును ఎందుకు లభ్యం చేసుకోలేకపోయారు? మీ హృదయం యెందుకు కాళీగా వుండిపోయింది - అని మీరు యెప్పుడయినా తీక్షణంగా తీవ్రంగా ఆలోచించారా?

ఈ ప్రశ్న మీకు మీరు వేసుకుంటే వచ్చే జవాబు యేమిటి? — ఏదో సందిగ్ధం, మోసం లేకుండా ముఖాముఖి లభించే జవాబు యేమిటి? ప్రశ్నను ఎంత తీవ్రంగా అడుగుతున్నారో ఆ మోతాదులోనే జవాబు కూడా వస్తుంది. ఎంత ఆతురంగా అడుగుతున్నారో అంత త్వరగా వస్తుంది. కాని మీకు తీవ్రత లేదు, ఆతురత లేదు. ఎందుకంటే మీకు ఆ జీవశక్తి లేదు; ఉద్వేగ పూరితమయిన శక్తి లేదు. ఆవేగం లేకుండా మీరు యెన్నటికీ సత్యాన్ని కనుగొనలేరు. ఆవేశంతో కూడిన ఆవేగం, ఉద్వేగం కావాలి. దానిలో ఎలాంటి కోరికలు ప్రక్షిప్తంగా వుండగూడదు. ఇలాంటి ఉద్వేగం చాల భయంకరమైనది. ఎందుకంటే, ఈ ఉద్వేగం వున్నప్పుడు యిది యెక్కడికి తీసుకుపోతుందో మీకు తెలియదు.

ఈ లక్షణమైన ప్రేమ మీలో లేకపోవటానికి, మీ హృదయంలో యీ జ్వాల లేకపోవటానికి - కారణం యేమిటో కనుక్కునేందుకు అవసరమయినంత ఉద్వేగం మీలో లేకపోవడానికి బహుశ భయమే మూలం కావచ్చును. మీ మనసును హృదయాన్ని బాగా లోతుగా పరిశీలించుకు పరీక్షించుకు చూచినట్లయితే, మీకు యిది యెందుకు లేదో అర్థం అవుతుంది. మీలో అది యెందుకు లేదని ఉద్వేగంగా చూచుకున్నట్లయితే, అది ఉన్నదనే విషయం తెలిసి వచ్చేది. పూర్తి నిరాకరణ ద్వారానే - అదే ఉద్వేగానికి మహోన్నత రూపం - ప్రేమ అనే ఆ వస్తువు అస్తిత్వంలోనికి వస్తుంది. వినయం మోస్తరుగానే మీరు ప్రేమను అలవరుచుకోలేరు. మోస ప్రవృత్తి పూర్తిగా అంతరించి పోయినప్పుడు వినయం బయటకు వస్తుంది. అప్పుడు మీకు వినయంగా వుండడం అంటే యేమిటో తెలియదు. వినయంగా వుండడం ఎలానో తెలుసును అనుకున్న మనిషి వ్యర్థుడు. అదే రకంగా మీ మనసును

హృదయాన్ని సమర్పణం చేసి, మీ నరాశయాన్ని కళ్లను, యావత్తు ఉని కిని జీవనవిధానం అంతా తెలుసుకుందుకు వినియోగిస్తే; యదార్థంగా వున్నది యేమిటో చూచి - దానిని అతిగమించి వెళ్లగలిగితే; పూర్తిగా సంపూర్ణంగా యిప్పటి జీవన ప్రక్రియను నిరాకరించితే - వికృతము క్రూరము అయిన దానిని నిరాకరించడంలోనే ఆ కొత్తది ఆవాహన అవుతుంది; అవతరిస్తుంది. ఆ సంగతి కూడా - అది వచ్చిన సంగతి - మీకు తెలియదు. తాను నిశ్శబ్దంగా వున్నాను అని తెలుసుకున్న మనిషి, తాను ప్రేమిస్తున్నాను అని తెలుసుకున్న మనిషి - ప్రేమ అంటే యేమిటో యెరగడు; నిశ్శబ్దం అన్నా యేమిటో యెరగడు.

*